్మను.

ఎమును మఱచి

చుకొనుచున్నాడు.

్వరూపమును విస్మరించి

... భావించుచున్నాడు. ఇట్టి

ులన అతడు కర్మబద్ధుడై జనన మరణ

ు చక్రమున తగుల్కొని నానా యాతనలను

ుంచుచున్నాడు. ఇపుడీ శ్లోకమునందు, రాబోవు

ుగు శ్లోకములందు జీవుని యథార్థ స్వరూపము

ుక్కగ తెలుపబడినది. సాధకుడు తాను కాని వస్తువుపై అహంభావమును వదలి తాను అయిన వస్తువగు సచ్చిదానంద ఆత్మయందు నిలకడ కలిగి బ్రహ్మానందమను భవించుగాక!

ఓం

xxxxxxxxxxxxxxxxxxxxxxx




సంపుటము : 24 | మే 1992 | సంచిక 5

## సంపాదకవర్గము



సంవత్సర చందా : రూ. 30/-లు

పంపవలసిన అడ్రసు : మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము
అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట
పి.బి.నెం.323, విజయవాడ-520 002
ఫోన్స్ : 61862, 64017, 72433
Telex : 0475 362 ANIL

శాశ్వత చందా : రూ. 300/-లు.

పంపవలసిన అడ్రసు : 'వేదాంతభేరి శాశ్వతనిధి'
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము
పోస్టు, శ్రీకాళహస్తి-517 640
ఫోన్స్: 2239,2543 STD Code 085 78

**చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.**

# వేదాంతభేరి

**అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక**

**BE FEARLESS : నిర్భయులై యుండుడు!**



**: ముఖచిత్రము :**

దుష్టశిక్షకుడు, శిష్టరక్షకుడు, సింహాచల నిలయుడైన
శ్రీ వరాహలక్ష్మీనృసింహస్వాములవారికి
మనసా శిరసా వచసానమామి.

# ప్రార్థన



## హనుమత్ప్రార్థన

ధ్యాయేద్బాల దివాకరద్యుతినిభం దేవారి దర్పాపహం
దేవేంద్ర ప్రముఖ ప్రశస్త విభవం దేదీప్యమానం రుచా।
సుగ్రీవాది సమస్త వానరయుతం సువ్యక్త తత్త్వప్రియం
సంయుక్తాయుత లోచనం పవనజం పీతాంబరాలంకృతమ్॥

బాలసూర్యునివంటి ప్రకాశము కలవారును, రాక్షసుల దర్పమును అడంచినవారును, దేవేంద్రాది ప్రముఖులచే ప్రశంసింపబడిన వైభవము కలవారును, దేదీప్యమానమగు కాంతితో గూడినవారును, సుగ్రీవాది సమస్త వానరసహితులును, తత్త్వజ్ఞాన సంయుక్తులును, వాయుపుత్రులును, పీతవస్త్రాలంకృతులును అగు హనుమంతుని ధ్యానించుచున్నాను.

**(26.5.1992–హనుమజ్జయంతి)**



# వివేకానంద శంఖారావము

The great lesson is that unity is behind all; call it God, Love, Spirit, Allah, Jehovah- It is the same unity that animates all life from the lowest animal to the noblest man. It is the same unity that animates all life from the lowest form to its noblest manifestation in man.

అన్నిటికిని వెనుక ఏకత్వము వెలయుచున్నది. దానిని దేవుడని చెప్పుడు, లేక ప్రేమ అని, ఆత్మ అని, అల్లా అని, జెహోవా అని– ఈ ప్రకారముగ ఏ పేరుతో నైనా పిలుచుడు. ఆ ఏకస్వరూపమే అల్పమృగము మొదలుకొని గొప్ప మానవుని వఱకుగల సమస్త ప్రాణులయొక్క జీవితమందు ప్రకాశించుచున్నది. ఆ ఏకత్వమే చిన్నప్రాణి మొదలుకొని ప్రజ్ఞావంతుడైన మానవుని వఱకు గల సమస్త ప్రాణుల యొక్క చైతన్యమై యలరుచున్నది. ○○



# ఉన్నతికి కొలతబద్ద

శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



గీతయందు శ్రీకృష్ణపరమాత్మను అర్జును డిట్లు ప్రశ్నించెను–

"దేవా– ప్రపంచములో తపస్సంపన్నులైన మహనీయులు, యోగనిష్ఠాపరులైన పుణ్యాత్ములు ఎందఱో కలరుకదా! వీరిలో పరిపూర్ణస్థితిని బడసి జీవన్ముక్తులైన మహాత్ములెవరో ఎట్లు తెలిసికొనగలము? ఒకడు దైవసాక్షాత్కారమును బొందెనో లేదో తెలిసికొనుటకు గురుతేమి?" జగద్గురువగు కృష్ణమూర్తి ధనంజయుని ఆ ప్రశ్నకిట్లు సమాధాన మొసంగెను– "అర్జునా! ఎవరు మానావమానములందును, నిందాస్తుతులందును సమభావము గలిగియుందురో అట్టివారిని జీవన్ముక్తులుగ నెఱుఁగుము".

భగవానుని ఈ సమాధానము మానవుని ఔన్నత్యమును పరీక్షించుటకు చక్కని కొలతబద్దగ ఉపయోగించుచున్నది. ఎవరైన దూషించినపుడు, నిందించినపుడు అజ్ఞాని తలక్రిందులైపోవును. క్రోధావిష్టుడగును. రోజుల తరబడి చింతచే కుమిలిపోవును. కాని జ్ఞానియగువాడు ఆయా నిందలచే ఏ మాత్రము ప్రభావితుడు కాకుండును.

*Censure and praise are mere vibrations of the air* 'నిందగాని, స్తుతిగాని గాలిలోని తరంగములు మాత్రమే– అని భావించు కొని వివేకవంతుడు నిబ్బరముగా నుండును. విచలితుడు కాకుండును. వాస్తవముగ విచారించినచో ఎవ్వరైన తిట్టినపుడు జరిగిన ఉదంతమేమి? ఆ తిట్టు అను శబ్దము వాయువులో ఒక తరంగము (*wave*)ను కలుగ జేసెను. అంతమాత్రమునకు ఎదుటివాడు తనకేమో మునిగిపోయినదని భావించవలసిన పనియేమి? దానివలన తనకేమి అపకారము జరిగినది? ఆ 'తిట్టు' అను శబ్దతరంగమును తాను స్వీకరించినచో బాధ కలుగునుగాని, స్వీకరింపనిచో, ఇచ్చినవారియొద్దకే అది తిరిగి వెళ్ళును (Return to the sender).

ఒకపుడు బుద్ధదేవుడు ఎచటికో పాదచారియై పోవుచుండెను. మార్గమధ్యమున ఒకడు కనుపించి అదేపనిగా బుద్ధుని దూషింప మొద లిడెను. కాని ఆ దూషణలను బుద్ధుడేమాత్రము నరకు గొనక తన దారిని తాను పోవుచుండెను. అపుడా పాంథుడు బుద్ధుని ఆపి 'అయ్యా! మిమ్ము లను చాలసేపటినుండి తిట్టుచున్నానుగదా! మీకేమీ బాధ కలుగలేదా యేమి?' అని ప్రశ్నింప అందులకు తథాగతుడిట్లు సమాధానమిచ్చెను–

'నాయనా! మీ ఇంటికి ఎవ్వరైన అతిథి వచ్చినచో అతనిని ఆదరించి మర్యాద చేసినపుడు మాత్రమే అతడు మీ ఆతిథ్యమును స్వీకరించి మీ ఇంటిలో తిష్ఠవేయును. అట్లుకాక, అతని విషయమై ఏమియు పట్టించు కొనక ఉపేక్షాభావము కలిగియున్నచో అతడు చూచి చూచి వెనుకకు వెడలిపోవునుగదా! అట్లే నీవు నన్ను దూషించుచున్నావు. ఆ దూషణను నేను స్వీకరించినచో మాత్రమే నాకు బాధ కలుగును. కాని ఆ ప్రకారము నేను చేయలేదు. ఆ దూషణ యెడల ఉపేక్షాభావమును వహించితిని. అందుచే అయ్యది మరల నీ యొద్దకే వచ్చి చేరినది'. బుద్ధుని ఆ వాక్యము లచే ఎదుటివానికి కనువిప్పు కలిగినది.

మహనీయులైనవారు ఎన్నియో యుక్తులచేతను, ఉపాయముల

చేతను మనోవికారములను జయించుచుందురు. నిందావాక్యములచే ప్రభావితుడు కాకుండుట కొఱకై ఒక మహనీయుడవలంబించిన పద్ధతిని చూడుడు–

మన్నిందయా యది జనః పరితోషమేతి
నన్వప్రయత్న సులభోఽయమనుగ్రహో మే
శ్రేయోర్థినో హి పురుషాః పరసౌఖ్యహేతోః
దుఃఖార్జితాన్యపి ధనాని పరిత్యజన్తి.

"నన్ను తిట్టి ఎవడైనా సంతోషపడుచో, అది నా అదృష్టము. ఎందుకనగా ఇతరులకు సంతోషమొనగూర్చు నిమిత్తము ఎంతయో డబ్బు ఖర్చుపెట్టి కొందఱు సత్రములను కట్టించుదురు. కొందఱు బావులను త్రవ్వించుదురు, కొందరు అన్నదానము చేయుచుందురు, కొందఱు వస్త్రాదులను సమర్పించుదురు. కాని నేనో, ఒక్కపైసా ఖర్చుచేయక ఒకనికి సంతోషము కలుగుటకు కారణభూతుడగుచున్నాను. నన్ను తిట్టి ఒకడు సంతోషపడుచున్నాడనగా, అతని సంతోషమునకు నేనే కారకుడను గదా. నా వలనే కదా అతనికి అంత ఆనందము కలిగినది.

'ఆహా! ఇతరుల ఆనందము కొఱకై జనులు వేనకు వేలు రూప్యములు ఖర్చుపెట్టుచుండ, ఏ మాత్రము ఖర్చు చేయకయే నేనొకనికి సంతోషమును కలుగజేయుచున్నాను గదా!'–అని ఒక మహనీయుడు తనలో భావించుకొని నిందలకు అతీతుడై నిలచెను.

సామాన్య పరిస్థితులలో అందఱును ప్రశాంతముగనే కనుపించు దురు. కాని జీవితములో కొన్ని ఒడిదుడుకులు సంభవించినపుడు, జనులు తమపై నిందలు మోపినపుడు, అభాండములు విసరినపుడు సామాన్యులు తలక్రిందులైపోవుదురు. వారి పరిస్థితి దాదాపు పిచ్చిపట్టి నట్లగును. కాని వివేకవంతుడు స్థితప్రజ్ఞుడై, మేరుసమ గంభీరుడై, దూషణభూషణములకు రవ్వంతైనను చలింపకయుండును. గాలి వీచు నపుడు గుండురాయి, ఎండుటాకు రెండును ఒకేచోట విశృంఖలముగ

నుండును. పెనుగాలి వీచినచో ఆకు ఎగిరి ఆమడదూరము పడును. గుండురాయి యథాప్రకారము కదలక మెదలక నుండును. ఇదియే జ్ఞానికి, అజ్ఞానికి గల భేదము. జ్ఞాని నిందలకు జంకడు. అజ్ఞాని నిందలకు భయపడి పారిపోవును. చిత్తవికలత్వమును బొందును.

ఒకింత వివేకమును ఉపయోగించి చూచినచో ప్రపంచమున మనోవికారములకు ఆస్కారమే యుండదు. వివేకరహితునకే చిత్తవైకల్యము సంభవించునుగాని వివేకయుక్తుడగు జ్ఞానికి కాదు.

పొగడబడువాడు మఱియును పొగడువాడు
తిట్టబడువాడు మఱియును తిట్టువాడు
ఒక్కడైయుండ స్తుతినిందలున్నె చెపుమ
స్వాంతమున నివ్యధంబున శాంతినొంది
ఎత్తిపాడుము కంఠము ఎత్తిపాడు
యతివరాధీర ఓం తత్సదనుచు పాడు.

వివేకానందుల పై వాక్యములీ సందర్భమున జ్ఞప్తియందుంచు కొనదగినవి. అంతయు ఒకే ఆత్మస్వరూపమని భావించువానికి లోకములో ఏ బెడదయు నుండదు. అతడెట్టి పరిస్థితులలోనైనను మనస్సును సమన్వయపఱచుకొని పోగలడు. ఆత్మతత్త్వము తెలియని అవివేకులకే ప్రపంచమున అడుగడుగున ఆపత్తులు సంభవించుచుండును. దుఃఖము వెన్నంటుచుండును. జ్ఞాని నిత్యానిత్యవస్తు వివేకము కలవాడై, ఆత్మయందు స్థితిగలిగి నశ్వరములగు ప్రాపంచిక విషయములందు తటస్థుడై, నిర్వికారుడై, సమచిత్తుడైయుండును. అతని చిత్తము శీతోష్ణ, సుఖదుఃఖ, మానావమానాది ద్వంద్వములందు సమత్వమును (balance) సాధించగలిగియుండును. అభ్యాసముచే ప్రతివానికిని అట్టి నిర్వికార స్థితి తప్పక ఉదయించగలదు. అభ్యున్నతిని అభిలషించువారు సమదృష్టి అను ఈ కొలతబద్దచే తమ పారమార్థిక ఔన్నత్యమును పరీక్షించుకొనుచుండవలెను.

౦౦

# మంత్రపుష్పము

'సాహిత్యప్రియ' శ్రీ పంతుల వెంకటరామారావు గారు

1. ఎవని యిచ్ఛ చేత నిలజీవరాసులు
పుట్టి పెరిగి తిరిగి గిట్టుచుండు
ఎవనిలోన విశ్వమేకమై యుండునో
నట్టి యాదిదేవు నాశ్రయింతు.

2. పంచతన్మాత్రలం బుట్టి ఆకృతి బరగు
త్రిగుణధాతుజ మూర్తియై దివియు నెవడు
ఆది మధ్యాంతములు లేని యట్టివాని
భక్తియుక్తుల నేజేతు ప్రార్థనంబు

3. జలజ ఖేచర భూచర జన్మకర్మ
విశ్వనాటక రంగము వెల్గజేయు
దర్శకుండగు పరమాత్మ దర్శనంబు
భక్తిమై గోరి నేజేతు ప్రార్థనంబు.

4. నిర్గుణుడును నిస్సంగ నిర్మలుండు
సర్వభూతాత్ముడీశుడు శాశ్వతుండు
ప్రణవనాద రసామృత పానరతుని
భక్తియుక్తుల నేజేతు ప్రార్థనంబు.

# మహాభారత సుధ

## అపకారికి ఉపకారము చేసిన మనీషి

మూర్తీభవించిన ధర్మమే ధర్మరాజు. అతనికి యుధిష్ఠిరుఁడను పేరు కూడ కలదు. పాండురాజునకు కుంతీదేవివలన కలిగిన ఐదుగురు కుమారులలో జ్యేష్ఠుఁడు ధర్మరాజు. ఆతనియందు ధైర్యము, స్థిరత్వము, సహిష్ణుత్వము, నమ్రత, దయాళుత్వము, అవిచలప్రేమ మున్నగు అనేక లోకోత్తర సుగుణములు కలవు. అతఁడు తన శీల, సదాచార, విచారశీలత్వములచే చిన్నతనమునందే లోకప్రియుం డయ్యెను.

ధర్మరాజుఅజాతశత్రువని లోకమున ప్రసిద్ధికెక్కెను. అతనికి ఎవరితోను వైరము లేదు. శత్రువుల యెడలను అతనికి సద్భావము కలిగియుండెను. పాండవులు ద్వైతవనమందున్నప్పుడు, గంధర్వులు దుర్యోధనుని యుద్ధమందు ఓడించి బంధించిరను వార్త వినగనే ధర్మరాజు తన సోదరులకు అతనిని ఎట్లైన విడిపించుఁడని చెప్పి పంపగా అర్జునుఁడు బాణవర్షమును కురిపించి గంధర్వులనుండి దుర్యోధనాదులను విడిపించిరి.

ఈ ప్రకారము అపకారికి ఉపకారము నొనర్చి ధర్మరాజు తన విశాల హృదయమును జనులకు వ్యక్తముచేసెను. పాండవుల వనవాస సమయమున ఆశ్రమమందు ద్రౌపది ఒకతెయే యున్నప్పుడు, సింధురాజగు జయద్రథుడు అచటికి వచ్చి ఆమెను బలాత్కారముగ రథముపై కూర్చుండఁబెట్టి వెడలుచుండ, ఆ వార్త తెలిసికొని పాండవులతనిని వెన్నంటిరి. భీముఁడాతనిని బంధించి ధర్మరాజు యొద్దకు గొనిరాగా ధర్మరాజు దయాపూర్వకముగ అతనిని విడిపింపజేసి తన క్షమాశీలత్వమును, దయాళుత్వమును ప్రత్యక్షముగ చూపెను.

అరణ్యమందు ఒకనాడు ధర్మరాజునకు దప్పిక కలుగగా నకులుని పిలిచి సమీపమునగల ఒక చెఱువునందలి నీటిని పాత్రతో తీసికొని రమ్మని చెప్ప, ఆతడట్లే వెడలగా ఆ చెఱువునొద్ద ఒక యక్షుఁడు "నేనడుగు ప్రశ్నలకు జవాబు ఇచ్చి తదుపరి నీరు త్రాగుము, నీరు గైకొని పొమ్ము" అని చెప్పగా, నకులుఁడు ఆ

వాక్యములను సరకుగొనక నీరు త్రాగబోగా నిశ్చేష్టుడై క్రింద పడిపోయెను. అట్లే తక్కిన మువ్వురు సోదరులు కూడ పడిపోయిరి.

తుదకు ధర్మరాజు అచటికి స్వయముగ వెడలి ఆ యక్షుని ప్రశ్నలకు సముచిత ప్రత్యుత్తరములనీయగా, అతడు సంతుష్టుడై నీ సోదరులలో నీవు కోరినవాని నొకనిని ఉజ్జీవింపజేసెదనని తెలుప ధర్మరాజు నకులుని ఉజ్జీవింపఁ జేయుమని కోరెను. అట్లెందులకు కోరితివని అడుగగా, ధర్మరాజు తన తండ్రికి కుంతి, మాద్రి అని ఇరువురు భార్యలు కలరనియు, కుంతీపుత్రులలో తానున్నాననియు, మాద్రీ సుతులలో నకులుడొకడుండినచో ఇరువురు తల్లులు, పుత్రవతులుగా నుందురని చెప్పి తన అద్భుత సమభావమును లోకమునకు వెల్లడిచేసెను. యక్షుడు సంతసించి నలుగురు సోదరులను ఉజ్జీవింపజేసెను.

ధర్మరాజునకు శ్రీకృష్ణుని యెడల, దుర్గాదేవి యెడల మిక్కుటమగు భక్తి కలదు. అతడు దుర్గాదేవిని స్తుతించి ఆమె వలన వరమును పొందెను (అజ్ఞాత వాసము జయప్రదముగా జరుగులాగున వరసిద్ధిని బడసెను). ధర్మరాజు సదాచార సంపన్నుడు, వినయశీలుడు, సమయోచిత వ్యవహారమందతడు అత్యంత కుశలుడు. అతడు గురుజనుల యెడల మానమర్యాదలు కలిగియుండెను. మహా కఠినసమయములందు కూడ అతడు శిష్టాచార మర్యాదను మఱువకుండెను. మహాభారత యుద్ధారంభ సమయమున ఇరుపక్షములందు సేనలు సుసన్నద్ధములై యున్నపుడు ధర్మరాజు శత్రుసేన యొక్క మధ్యనుండి పోయి భీష్మ, ద్రోణ, కృప, శల్యుల పాదములకు నమస్కరించి వారి ఆశీర్వాదమును అర్థించెను. ధర్మరాజు యొక్క ఇట్టి వినయపూర్వక, శిష్టజనోచితవ్యవహారముచే వారందఱు మిక్కిలి ప్రసన్నులైరి.

ధర్మరాజుయొక్క ఉదారత్వము చెప్పుకొనదగినది. పాండవులకు రాజ్యమొసంగుటకు కౌరవులు సమ్మతించనపుడు తమకు ఐదు గ్రామములైనను ఇచ్చిన చాలునని ధర్మరాజు తెలియజేసెను. కాని దుర్యోధనుడందులకు అంగీకరింపలేదు. కావున యుద్ధము అనివార్యమైనది. యుద్ధము సమాప్తమైన వెనుక ధర్మరాజు యొక్క రాజ్యాభిషేకానంతరము కూడ ధర్మరాజు గాంధారీ ధృతరాష్ట్రుల యెడల నెంతయో సద్భావము కలిగియుండెను. ధర్మరాజు ఎచటికి వెళ్ళినను అచట పవిత్ర వాతావరణము నెలకొనుచుండును. ఆతని సన్నిధియందు నరకవాసులు కూడ సుఖశాంతులను బడసిరి. నహుషుడు అగస్త్యుని శాపముచే అజగరమై యున్నపుడు ధర్మరాజు యొక్క దర్శన సంభాషణల మాత్రముచే అజగర జన్మనుండి విముక్తి నొంది తిరిగి స్వర్గమును పొందెను. వెయ్యేల,

# మహాత్ముల ప్రబోధము

## శ్రీ వివేకానందస్వామి

1. సత్యము, పవిత్రత, నిస్స్వార్థత– అను ఈ సుగుణములు కలవానిని అణగద్రొక్కగల సామర్థ్యము ముల్లోకములందెవనికిని లేదు. జగత్తంతయు యెదురు తిరిగి నిలిచినను ఈ సుగుణములు కలవాడు ఒంటరిగా వారినందఱిని యెదిర్చి నిలువగలుగును.

2. సత్యమునకు గుఱుతు ఇదియే– మిమ్ములను శారీరకముగాను, మానసికముగాను, ఆధ్యాత్మికముగాను ఏది దుర్బలమొనర్చునో దానిని విషమువలె త్యజించివేయుము. దానియందు జీవములేదు. కావున అది సత్యమెన్నటికిని కాజాలదు. సత్యమెపుడును బలవర్ధకమై యే యుండును. సత్యము నిర్మలమై జ్ఞానమయమై యుండును. సత్యమెపుడును బలప్రదమై, జ్ఞానోద్దీపకమై, శక్త్యుత్సాహదాయకమై యుండవలెను.

3 లెమ్ము! మేలుకొనుము! గమ్యము చేరువఱకు నిలువకుము! లెమ్ము! ఈ దుర్బలత్వమను మైకము నుండి మేల్కాంచుము! మేల్కాంచుము! ప్రపంచములో యెవరును దుర్బలులు కారు. ఆత్మ అనంతము, సర్వశక్తియుతము, సర్వజ్ఞము అయియున్నది. కాబట్టి లెమ్ము! నీ ఆత్మశక్తిని ప్రకటింపుము! నీలో నున్న దైవమును చాటుము! ఆతనిని యెన్నడును తిరస్కరింపకుము! ○○

---

⇨ ధర్మో వివర్ధతి యుధిష్ఠిర కీర్తనేన

అనునట్లు ధర్మరాజు యొక్క కీర్తనమాత్రముచే ధర్మము అభివృద్ధి యగును. ధర్మరాజు యొక్క జీవితము మహాపవిత్రమై, ధర్మయుక్తమై జనులకు ఆదర్శవంతమై అలరారుచున్నది. ○○

# నామసంకీర్తన



1. జయ హరి విఠలా । శ్రీ హరి విఠలా
పాండురంగ విఠలా । పండరినాథా విఠలా
గోవింద విఠలా । గోపాల విఠలా
ముకుంద విఠలా । మోహన విఠలా॥

2. ప్రభు రఘునాథ దయాకరో ।
సీతామాయీ కృపాకరో॥

3. ఓమ్ నమో భగవతే వేంకటేశాయ
వేంకటేశాయ శ్రీనివాసాయ
శ్రీనివాసాయ నారాయణాయ
నారాయణాయ మోక్షరూపాయ॥

4. ఆంజనేయ వీరా । హనుమంత శూరా
వాయుకుమారా । వానర ధీరా
శ్రీరామ దూత । జయ హనుమంతా॥

5. హరి జై హరిజై శ్రీహరిజై । గోవింద కేశవ గోపాల జై
హరి జై హరిజై శ్రీహరి జై । ముకుందవామనగోవిందజై

OO

Our duty is to realise the Atman within this body.

మన కర్తవ్యము ఈ దేహమందున్న ఆత్మను సాక్షాత్కారించుకొనుటయే.

# ఆరోగ్యసాధన

## బెండ

శ్రీమతి కె. భార్గవి గారు M.Sc.,(అనంతపురం)

బెండకాయలు పొడవుగ, పచ్చగ మొనతేలి చాల సొంపుగ వుంటాయి. బెండకాయలకు జిగురు వుంటుందని చాలామంది వెలివేస్తారు. కానీ బెండకాయ అతి సులభముగా జీర్ణమగు ఆహారము. లేత దశలో బలవర్ధకమైనది. సాధారణంగ దొరకు కాయగూరలలో బెండ ఒకటి.

ఎంత సులభముగ జీర్ణమగునో దీనిని అంత సులభముగ మన పెరటిలో పెంపొందించుకోవచ్చు. భూమిని చదునుచేసి, త్రవ్వి పశువుల ఎరువువేసి విత్తనములను వరుసకు వరుసకు మధ్య 1 అడుగు, అలాగే మొక్కకు మొక్కకు మధ్య 1 అడుగు వుండేలా నాటవలెను. నాటిన 3-4 దినములలో అంకురించుట జరుగును. అతిత్వరగ అంటే 40 దినములలో పుష్పించును. పుష్పించిన 7, 8 దినములకే కాయలు కాయవచ్చు. ఏమాత్రము ముదిరినా, వంటకు పనికిరాదు. కాయ కొన 'టప్' అని విరిగిన (త్రుంచినప్పుడు) అది లేతకాయ అని చిహ్నము. అతి తక్కువ కాలంలో అతి సులభముగ మనము లేత బెండకాయలను పెరటిలో పెంచుకోవచ్చు.

బెండలో మాంసకృత్తులు 1.9 గ్రా., క్రొవ్వు 0.2 గ్రా., ఖనిజములు 0.7 గ్రా., కార్బోహైడ్రేట్లు 6.4 గ్రా., సున్నము 68 మి.గ్రా., భాస్వరం 58 మి.గ్రా., ఇనుము 1.5 మి.గ్రా., గంధకము 30 మి.గ్రా., రాగి 0.19 మి.గ్రా., విటమిన్‌సి 13 మి.గ్రా., థయామిన్ 0.07 మి.గ్రా., నియాసిన్ 0.5 మి.గ్రా., రైబోఫ్లెవిన్ 0.10 మి.గ్రా. పోషక విలువలు 100 మి.గ్రా. భుజించు పదార్థములో కలవు.

బెండకాయలను వేపుడుగాను, సాంబార్‌లో ముక్కలు వేసి, పులుసుగాను, వరుగులుగాను, పచ్చడిగాను చేయుదురు. కాగితపు పరిశ్రమలో దీని నారను వాడెదరు.

ఇందులో లేత ఆకుపచ్చ రంగులో కలవి, ముదురు ఆకుపచ్చ రంగులో

# అమృత బిందువులు

శ్రోత్రం శ్రుతేనైవ న కుండలేన
దానేన పాణిర్నతు కంకణేన
విభాతి కాయః ఖలు సజ్జనానాం
పరోపకారేణ న చందనేన.

సజ్జనులు శాస్త్ర శ్రవణముచేతనే తమ చెవులను సార్థకము చేసికొందురుగాని కుండలములను ధరించుటచేత కాదు. చేతులను దానమొనర్చుటచేతనే ప్రకాశవంత మొనర్చుకొందురుగాని కంకణాదులను ధరించుటచే కాదు. అట్లే శరీరమును పరోప కారముచేతనే ప్రకాశవంతమొనర్చుకొందురుగాని చందనాదుల లేపనముచే కాదు.

1. చిత్తమేవహి సంసార స్తత్ప్రయత్నేన శోధయేత్.
   చిత్తమే ప్రపంచము. కావున దానిని ప్రయత్నపూర్వకముగ శుద్ధమొనర్చ వలయును.
2. మూఢోత్తారణ మేవేహ స్వభావో మహతామితి.
   అజ్ఞానులను ఉద్ధరించుటయే మహాత్ముల స్వభావము.
3. న ధర్మాత్పరమం మిత్రం నానృతాత్పాతకం పరమ్.
   ధర్మమును మించిన స్నేహితుడు లేడు, అసత్యమును మించిన పాపములేదు.
4. న స్వధైర్యాదృతే కశ్చి దభ్యుద్ధరతి సంకటాత్.
   తన యొక్క ధైర్యముతప్ప సంకటమునుండి కాపాడునది మఱియొకటిలేదు.
5. నాస్తి నిర్వాసనాన్మౌనాత్పరం సుఖకృదుత్తమమ్.
   వాసన లెవ్వియు లేక మౌనముతో నుండుటకంటె సుఖకరమైన స్థితి వేఱొకటి యెద్దియును లేదు. ○○

---

కలవి, నూగు కలవి, పట్టీలు కలవి (రిడ్జస్) అను రకముల కాయలు కలవు. కేరళ విశ్వవిద్యాలయములోని వృక్షశాస్త్ర విభాగంవారు పరిశోధనలు చేసి తక్కువ జిగురు కలిగినవి, త్వరలో ఫలించునవి సాధించిరి. కాయలు ఎరుపు రంగులో వుండును. పుష్పములు పసుపు రంగులోనే వుండును. ఈ ఎరుపు రకము ఇంకా బలవర్ధకమైనవి.

జిగురు అని సందేహించక వాడి, బద్ధకించక ఈ మొక్కలను (అవకాశమున్న వారు) సులభ రీతిలో పెంచి, లేత కాయలను పొంది, సులువుగ వండిన, పోషక పదార్థాలను సులభంగా సంతరించుకోవచ్చు. బెండకాయలు కొనునప్పుడు కొన విరచనిదే తీసుకోవడం మరువకండి! ○○

# పరమహంస సదుపదేశములు

## శ్రీ రామకృష్ణ పరమహంస ఇట్లు చెప్పిరి-

1. కొద్ది దూరమున నిలబడి చూచినచో సముద్రము నీలి రంగుగ కనపడును. సమీపమునకు వెళ్ళి గమనించినచో ఆ రంగు కనుపించదు. అటులనే మహనీయులలో ఎవరియందైన వర్ణభేదము అగుపడినను యథార్థముగ వారు పరిశుద్ధ స్వరూపము, నిర్మల స్వభావము కలవారు అయి యుందురు.
2. సముద్రమందు పెద్ద నౌకను అనుసరించి చిన్న చిన్న పడవలు పోవుచుండును. ఆ విధముననే జగత్తునందు భగవంతుడు అవతరించినపుడు అనేకులు వారిని అనుసరించుచుందురు.
3. రైలు ఇంజను పెట్టెలు పెక్కింటిని లాగుకొనిపోవులాగును మహాత్ములు వేల కొలది జనులను దైవసన్నిధికి తీసుకొనిపోవుదురు.
4. గారడివాడు చూపు విచిత్రములను క్రొత్తవారు వచ్చి ఆశ్చర్యముగ తిలకించుదురు కాని అతని కుటుంబ సభ్యులు కాదుకదా! ఆ ప్రకారముగనే జీవన్ముక్తుని కడకు దూరమున ఉన్న ముముక్షువులు వచ్చి ఆశ్రయించుచుందురు. అమ్మహనీయుని సమీపమున ఉన్న కొందరు అతని మహిమను ఎరుగకయే ఉండవచ్చును.
5. ఈగ ఒకప్పుడు అశుద్ధ పదార్థములపై, మరొకప్పుడు మధుర పదార్థములపై వాలును. అదే విధముగ వైరాగ్యము లేనివాడు ఒక పర్యాయము ప్రపంచ విషయములను గూర్చి ఆలోచించును, మరొకసారి ఆధ్యాత్మిక ప్రసంగములను చేయుచుండును. విషయాసక్తి వలన దుఃఖము, అశాంతి కలుగునని తెలుసుకొని మనుజుడు పరమశాంతిని, సుఖమును ప్రసాదించు దైవభక్తి, విశ్వాసమును పెంపొందించుకొనవలెను. అనన్య భక్తి, వైరాగ్యము కలవాడు త్వరలోనే దైవప్రాప్తిని బడయగలడు.

OO

# మహాత్ముల అడుగుజాడలలో పయనిద్దాం

-ఈశ్వర్

లోకమున జనులు పలువిధములగు మనస్తత్త్వములు గలిగియుండినను వారిని ఐదు తరగతులుగ విభజించవచ్చును.

## మొదటి తరగతివారు

సత్కార్యములను ప్రారంభించి తాము సంకల్పించిన అట్టి పవిత్ర కార్యమును ఆచరించుటలో అనేక విఘ్నములు ఎదురైనను దృఢమయిన వజ్రతుల్యమగు ధైర్య సాహసములతో ముందుకు కొనసాగుచు కార్యమును పూర్తిచేయనిదే విశ్రాంతినొందరు.

## రెండవ తరగతివారు

జప, ధ్యాన, ధర్మ, పరోపకారాది కార్యములను ప్రారంభించి మధ్యలో ఏవైనా విఘ్నములు తటస్థించినచో ఆ కార్యములను విరమించివేయుదురు.

## మూడవ తరగతివారు

తాము సంకల్పించిన సత్కార్యములను చేయదలంచియు రేపు, రేపు అని వాయిదా వేయుచు కార్యమునకు కాలదోషమును పట్టించుచు అమూల్యమగు కాలమును వ్యర్థము చేయుచుందురు.

## నాల్గవ తరగతివారు

సత్కార్యములను గూర్చిన సంకల్ప మాత్రముతోనే తృప్తిపడుచుందురు. వారు గాలిలో మేడలు కట్టుదురు. అంతమాత్రమేకాని కార్యమును ప్రారంభించుట గాని, ప్రారంభించవలెనని ఉద్దేశించుటగాని కలిగియుండరు. మాటలతోనే తృప్తిచెంది సంతోషించెదరు.

## ఐదవ తరగతివారు

తాము సత్కార్యములు ప్రారంభించకపోగా ఎదుటివారు చేయుచుండినచో వారిని జూచి హేళనచేయుచుందురు.

ఈ ఐదు తరగతివారలలో మొదటి తరగతివారే మహాత్ములనబడుదురు.

వారు దుఃఖమునందు సంతోషమును, ఆపత్తునందు ధైర్యమును, దూషణయందు భూషణమును, చెడ్డయందు మంచిని గ్రహించుటయేగాక శీతోష్ణ సుఖదుఃఖములకును, మానావమానములకును, అతీతులుగను, సాక్షిభూతులుగను వ్యవహరించెదరు. ప్రపంచ జనులలో కొందరు వారిని గూర్చి ఎట్టి దురభిప్రాయమును వెళ్ళబుచ్చినను, వారు సత్యమందే స్థిరప్రతిష్ఠ గలిగి–

"కొందరో సత్యమెరుంగుచుందు రిలను
కాని తక్కినవారలు ఘనుడ విస్ము జేసి
నవ్విన లక్ష్యంబు చేయబోకు"

అను వివేకానందుల వాక్యానుసారము జనుల నిందాస్తుతులను లక్ష్యపెట్టక నుందురు. వారు అజ్ఞానాంధకారమును పటాపంచలుచేసివైచి, జ్ఞానజ్యోతియై ప్రకాశించుచు, అనేక భౌతిక, ఆధ్యాత్మిక శక్తులను కరతలామలకము చేసికొని ఈ అనంత విశ్వమందు ఆనందపరవశులై సంచరించెదరు. అయినను

అద్వైతం త్రిషులోకేషు
నాద్వైతం గురు సన్నిధౌ.

అద్వైతమును మూడు లోకములలో ప్రదర్శించవచ్చునుగాని గురుసన్నిధి యందు మాత్రము ప్రదర్శించరాదను వాక్యమునకు బద్ధులై వారు తాము ఎంత ఉన్నత స్థానము నధిష్ఠించినను గురు వాక్యమును తు.చ. తప్పకుండా ఆచరించుచు గురుసన్నిధియందు వినయ విధేయులై పరిపూర్ణ గురుభక్తిని కలిగియుందురు. అట్టి మహాత్ములు ముందు తాము ఆచరించి తరించి తదుపరి సమస్త మానవాళిని తరింప చేయుటకు ప్రయత్నించెదరు.

సూదంటు రాయి సూదులను ఆకర్షించిన విధముగ మహాత్ములు నాస్తికులను సహితము తమవైపునకు ఆకర్షించుకొని తరింపచేయుదురు. బుద్ధభగవానుడు, రామకృష్ణ పరమహంసాది మహనీయులు ఈ ప్రకారముగనే ప్రపంచమున ఆధ్యాత్మిక జ్ఞానజ్యోతిని వెలిగించగలిగిరి. ఇట్టి ప్రయత్నములో వారు ప్రతిబంధములను లెక్క చేయక జ్ఞానప్రబోధమునే దృష్టిలో ఉంచుకొని అనంత సంసార సాగరమును తాము అవలీలగ దాటివైచి ఇతరులను దాటింపజేసిరి. అట్టివారే మహాత్ములు.

ప్రతివారును తామిప్పుడున్న స్థితిని బాగుగ పరిశోధించుకొని మహోన్నత మగు మహాత్ముల స్థితికి చేరుటకై అనవరతము ప్రయత్నము సల్పుచు మానవ జీవితమును ఫలప్రదము గావించుకొనవలెను. OO

# ఆధ్యాత్మిక  కథలు

## నాలుకపై అదుపు

ఒక పట్టణములో ఒక సాధువు గారు ఆధ్యాత్మిక విషయములను గూర్చి గంభీరముగ ఉపన్యసించుచు, రుచులను కోరవలదనియు, నాలుకపై అదుపు కలిగియుండవలెననియు, అది కోరిన వస్తువును దానికివ్వవల దనియు, నాలుకపై సంయమమును సాధించుటకై అది కోరిన వస్తువును దానికి ఇవ్వవద్దనియు, వారి వారికి ఇష్టమైన వస్తువును తినకుండవదలి వేయవలసినదనియు ప్రజలకు హితవు చెప్పెను.

మఱునటి రోజు ఉపన్యాసమును ప్రారంభించుచు ఆ సాధువు "సభ్యులారా! నాలుకకు ఇష్టమైన వస్తువేదేని వదలినారా?" అని ప్రశ్నింప సభలో నుండి ఒక యువకుడు లేచి "స్వామీ! నాకు పచ్చిమిరపకాయ లంటే ఇష్టం. కావున వాటిని వదిలివేసినాను" అని చెప్పగా సాధువు గారు సంతోషించిరి. ఉపన్యాసమంతయు పూర్తి అయిన పిదప సభికులు ఆ యువకుని చుట్టుముట్టి "ఏమండీ! అంత ఇష్టమైన పచ్చిమిరపకాయలను ఎట్లువదలగలిగినారండీ?" అని అడుగగా "ఎండుమిరపకాయలను వాడు చున్నాను" అని అతడు బదులుచెప్పెను. అది సరియైన సంయమము కాదు కారము తగ్గించుటో, తొలగించుటో చేయవలెనుగాని మఱియొక రూపమున దానిని స్వీకరించరాదు. అది సవ్యమైన నిగ్రహము కాదు. అది బూటకపు సంయమమే కాగలదు. దానివలన నాలుక అదుపులోనికి రాజాలదు.

జీవితలక్ష్యమగు ఆత్మసాక్షాత్కారమును, బంధవిముక్తిని సాధించు టకు మనుజుడు తన ఇంద్రియములను, మనస్సును జయించవలెను. యమనియమాది వ్రతపాలనచేతను, సత్సాంగత్య సంతోష ఆత్మ విచా

రణాదుల బలవత్తరమైన జిహ్వేంద్రియమును చేతను సంయమమొనర్ప వలెను. మొట్టమొదట నాలుకపై విజయము సాధించుట కష్టతరముగ కనపడినను క్రమముగ అభ్యాసముచే, వైరాగ్యముచే, అకుంఠిత భగవద్భక్తిచే జితేంద్రియత్వమును సంపాదించవలెను. చిత్తమును, ఇంద్రియములను నిర్మలములుగ ఒనర్చుకొని స్వస్వరూపానుభవమును బడసి జీవుడు ధన్యుడు కావలెను.

శ్లో : [illegible]
సత్యమైన సంయమము కలవారై [illegible]

౧౦

## దృష్టి భేదము

పరివ్రాట్ కాముకః
కుణపః కామినీ భక్ష్యమితి త్రిధా వికల్పాః

ఒక సుందర స్త్రీని విరక్తుడగు సన్న్యాసి రక్తమాంసములతో గూడిన ఒక బొమ్మగ, లేక శవముగ వీక్షించును. కాముకుడైన వాడు ఆ స్త్రీనే భోగ దృష్టితో చూచుచు ఆమెను ఒకానొక లావణ్యమైన అందాలరాణిగ చూచును. పసిబాలుడు ఆ స్త్రీనే తల్లిగ భావించి ఆపై పాలు త్రాగుటకు వాంఛించును. ఈ ప్రకారముగ లోకములో ఒకే వస్తువును జనులు వారి వారి దృష్టిభేదము ననుసరించి భిన్న భిన్నముగ అవలోకించుచున్నారు.

*(కాబట్టి సాధకుడా! దృష్టిని పవిత్రముచేసికొని సమస్తమును బ్రహ్మస్వరూపముగ వీక్షించుము. అట్టి సదభ్యాసమును కలుగజేసికొనుము. ఎల్లెడల దైవభావన గలిగియుండుము. అట్టితరి ఏ వికారములు నిన్ను బాధింపనేరవు.)*

# ప్రశ్నోత్తర వేదిక ?



## సందేహాలు - సమాధానాలు

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.

(తిరుపతి)

ప్రశ్న : *భగవంతునికి ఎందరో భక్తులు ఎన్ని రకాలవారో ఉంటారు. అందులో ఎటువంటి భక్తులు ఆయనకు చాలా ప్రియులుగా ఉంటారు? స్థూలంగా ఉత్తమ భక్తులకుండాల్సిన లక్షణాలేవి?*

జవాబు : భక్తులు అనేక రకాలుగా ఉంటారు. అందులో ఉత్తమశ్రేణికి చెందినవారు ఇలా ఉంటారు : ఏ జీవిపైనా ద్వేషం లేకుండా తనకు వారివల్ల కలిగిన బాధ తన ప్రారబ్ధకృతమని భావిస్తూ, వారి విషయంలో స్నేహాన్ని, దయను నిరంతరం కలిగి ఉంటాడు ఉత్తమ భక్తుడు. వాడికి 'ఇది నాది' అనే మమకారం గాని, 'ఇది నేను చేస్తున్నాననే' అహంకారంగాని ఉండదు. దుఃఖాన్ని, సుఖాన్ని అతడు ఓర్పుతో సమానంగా సహిస్తాడు. భగవత్ప్రసాదమని స్వీకరిస్తాడు. ఎప్పుడూ తృప్తితో, మనోనిగ్రహంతో, తన జీవితలక్ష్యాన్ని, కర్తవ్యాన్ని నిశ్చయించుకొని మనస్సును, బుద్ధిని, జీవితాన్ని భగవదర్పణంచేసి లోకయాత్ర చేస్తూ ఉంటాడు. అతడే దేవునకు చాలా ఇష్టుడైన భక్తుడు.

కామం-క్రోధం-లోభం-మోహం-మదం-మాత్సర్యం అనే అంతశ్శత్రువులను ఆరుగురను జయించడంవల్ల, ఎవరివల్ల లోకం భయపడదో, ఎవరు లోకంవల్ల కూడా భయపడరో, సుఖ దుఃఖాలు భయోద్వేగాలు ఎవరిపైన ఏ రకమైన ప్రభావాన్ని చూపవో, అతడే భగవంతునికి ప్రియమైన భక్తుడు. ఏ అపేక్ష లేక, ఆచారం కలవాడై, సమర్థుడై, తనకు కలిగే మంచిచెడుల విషయంలో తటస్థుడై

యుండటంవల్ల ఏ చింత లేనివాడై, ఫలాపేక్షతో ఏ కార్యాన్ని ఆరంభించకుండా తన కర్తవ్యాన్ని మాత్రం జాగ్రత్తగా నిర్వహిస్తూ ఉండే భక్తుడే భగవంతునకు ప్రియుడు.

ఎవరు మంచి కలిగితే పట్టలేని సంతోషాన్ని పొందరో, ఏదైనా చెడు కలిగితే దుఃఖపడరో, రాగద్వేషాలు ఎవరిపైన ప్రభావాన్ని చూపలేవో, మంచి-చెడులను, పుణ్య పాపాలను ఎవరు దేవునకే వదలి కర్తవ్యతాబుద్ధితో కర్మల్ని ఆచరిస్తారో వారు భగవంతునకు ఇష్టులైన భక్తులు.

ఎవడు శత్రువులపైన, మిత్రుల పైన, సమ్మానములలో, అవమానములలో, శీతోష్ణ స్పర్శలలో, సుఖ-దుఃఖాలలో, నిందా-స్తుతులలో సమానమైన భావన కలిగి, ఇష్టమైన పై విషయాలు అందుబాటులో లేనప్పుడు లేవే అని బాధపడ కుండా, వాటిపై ఆసక్తి వదలి, మౌనంగా ఏది లభించినా దానితో సంతోషాన్నే పొందుతూ, ఒకచోటే స్థిరంగా ఉండక, స్థిరమైన బుద్ధిగలవాడై ఉంటాడో వాడు భగవంతునికి చాలా ఇష్టుడు. ఇటువంటి భక్తులు ఉత్తమోత్తములు. కనుక స్వామి వారినెల్లప్పుడు వెన్నంటి కాస్తూ, వారికి వచ్చిన బాధలను తనంతట తానే కల్పించుకొని నివారిస్తూ, వారిని కాపాడి మోక్షాన్నిస్తాడు.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ॥
(భగవద్గీత 12-13) ○○

God will come to everyone. Harmony is within the reach of all.

**దేవుడు ప్రతివాని చెంతకు వచ్చును. శాంతి అందరికిని అందుబాటులో ఉన్నది.**

Through Concentration of mind everything can be accomplished.

మనస్సు యొక్క ఏకాగ్రతచే సమస్తము సాధించవచ్చును.

# ధర్మం

ఓంప్రకాశ్

"ధర్మం బాబూ" అంటూ భిక్షగాడు వచ్చి డబ్బా చూపాడు.

"చిల్లర లేదబ్బీ"

"పోనీ రూపాయివ్వండి, నోటైనా ఫర్వాలేదు"

"ఆఁ!" అంటూ తెల్లబోయి చూశాడు పరంధామయ్య.

"సరే, నోటిస్తాగానీ, ఇందాకట్నుంచీ ధర్మం, ధర్మం అంటూ అరుస్తున్నావే. ధర్మమంటే ఏమిటో చెప్పు చూద్దాం" అనడిగాడు.

"ధర్మమంటే...ధర్మమంటే...ధర్మమంటే బాబూ–నాకు తెల్దండీ" అంటూ తల గోక్కుంటూ బిత్తర చూపులు చూడసాగాడు.

"తెలీందే మరి ధర్మం ధర్మం అంటావేంటి?"

"ఏదో అలవాటైపోయింది బాబూ. అడుక్కునేవాళ్లంతా అలాగే అడుక్కుంటా రండి" అన్నాడతను.

"ఇందా అబ్బీ" అంటూ అతని కూతురు అమల భిక్షగానికి పావల బిళ్ల వేసి, తండ్రివైపు చూసింది. భిక్షగాడు దీవిస్తూ వెళ్ళిపోయాడు.

"నాన్నా!ఆ అబ్బి మాటలకేంకాని, నాకూ 'ధర్మం' అంటే ఏమిటో స్పష్టంగా తెలియదు. నువ్వే చెప్పాలి" అంది అమల.

"ఔనమ్మా! ఎంతో గంభీరమైన పదాలు, ఇలా తేలిక పదాలుగా ప్రచారంలోకి వచ్చేశాయి. అదంతా మన ప్రారబ్ధం. విద్యాగంధం లేనివారు ఆ మాటల్ని అలా వాడుతున్నారంటే, కాస్త సహించవచ్చు. కానీ, విద్యావంతులు సైతం ధర్మం, త్యాగం, దానం, సేవ, వైరాగ్యం, జ్ఞానంలాంటి లోతైన అర్థాలుగల పదాలను తేలిగ్గా వాడేస్తున్నారు. నువ్వు తరుచుగా వింటూనే ఉంటావుకదా, 'గురూ' అన్న మాట ఎంతగా పతనమైపోయిందో!" అన్నాడు పరంధామయ్య ఆవేదనగా.

"ఔను నాన్నా. మరి ధర్మం గూర్చి..."

"చెబుతానమ్మా! మనిషికి ప్రేమ, త్యాగం-భక్తి-విరక్తి-జ్ఞానం కలిగించేదే ధర్మం. అదే సనాతన మానవ ధర్మం. ధర్మానికి మూలం ఆ పరమాత్మయే. లోక రహితం, మానవాభ్యుదయం, శ్రేయస్సుల కోసమే ఆ పరమాత్మ ధర్మాన్ని ప్రవర్తింపచేశాడు"

"ధర్మానికి, మనుషులుచేసే కర్మలకు సంబంధమేమైనా ఉందా? నాన్నా"

"సంబంధమా!! ధర్మం లేకుండా కర్మలు లేవమ్మా! కర్మలన్నీ ధర్మంతో నియంత్రితమౌతుంటాయి. ధర్మం లేకుండా కర్మలుచేస్తే, అవి ఆత్మగ్లానికే దారి తీస్తాయి. ధర్మయుక్త కర్మలు ఆత్మజ్ఞానానికి దారి చూపిస్తాయి"

"ఆత్మజ్ఞానం-అదేమిటి నాన్నా?"

"అదే మనిషి పరమ పురుషార్థం తల్లీ! ఆ విషయం తర్వాత చెబుతాను. ముందు ధర్మలక్షణాలు విను. విని ఆచరించు"

"చెప్పు నాన్నా"

"ధర్మానికి ముప్పయికి పైగా లక్షణాలు చెబుతుంటారు. సత్యం-దయ-తపస్సు-శౌచం-తితిక్ష-వివేకం-మనస్సంయమం-ఇంద్రియ సంయమం-అహింసా-బ్రహ్మచర్యం-త్యాగం-స్వాధ్యాయం-సరళత-సంతోషం-సమదర్శిత్వం-మహాత్ముల సేవ-సద్బుద్ధి-క్రమంగా సంసారం నుండి నివృత్తులు కావటం-అహంయుక్త ప్రయత్నాల ఫలం విపరీతమని ఎరగటం-మౌనం-ఆత్మచింతనం-ప్రాణులకు అన్నాదులను తగు రీతిన పంచటం-ప్రాణులందు విశేషించి మనుషుల్లో తన ఆత్మభావన, ఇష్ట దేవతాభావన కలిగి ఉండటం, భగవంతుని దాస్య, సఖ్య, ఆత్మ సమర్పణ భక్తితో ఆరాధించటం-ఇవన్నీ పరమ ధర్మాలు తల్లీ" అమల ఆశ్చర్యంగా వింటోంది.

"ధర్మాన్ని, ధర్మం కోసమే ఆచరించాలమ్మా. దాని నుండి లౌకిక పారలౌకిక విషయాలేవీ కోరరాదు. అప్పుడే ధర్మం, జ్ఞానానికి వెలుగుబాట అవుతుంది"

OO

ortant in life - freedom, strength and sameness.

స్వాతంత్ర్యము, బలము, సమత్వము-అను ఈ మూడును జీవితమందు చాల



# వేదాంతగోష్ఠి

## నేటి చర్చనీయాంశము - శ్రద్ధ

**శిష్యుడు (శివప్రసాద్)** - స్వామీ! గురుదేవా! మోక్షసాధనములైన శమాదిషడ్గుణములలో నాలిగింటిని గూర్చి తమరు అనుగ్రహభాషణము గావించి యున్నారు. ఇక ఐదవదైన "శ్రద్ధ"ను గూర్చి విపులంగ తెలియజేయ ప్రార్థిస్తున్నాను.

**గురువు (ప్రబోధానంద స్వాములవారు)** - నాయనా! శివప్రసాద్! నీవడిగిన దానిని చెప్తున్నాను సావధానంగా విను. వ్యావహారిక రంగమందైనను, పారమార్థిక రంగమందైనను రాజకీయరంగమందైనను వెయ్యేల, ఏ రంగమందైనను, ఏ కార్యమందైనను 'శ్రద్ధ' చాల అవసరం. శ్రద్ధయే కార్యవిజయానికి తోడ్పడుతుంది. శ్రద్ధ లేకుండ చేసిన కార్యం చేయనిదానితో సమానమని గీతాచార్యులు పేర్కొన్నారు.

శ్రద్ధ లేనివానికి కార్యమందు ప్రవృత్తియే కలుగదు. ప్రవృత్తియే లేనపుడు కార్యసిద్ధి సంభవించనే సంభవించదు. "ఈ కార్యమును తప్పక చేయాలి. విజయం పొందాలి" అను దృఢతర దీక్ష కలవానికే కార్యసాఫల్యం సిద్ధిస్తుంది. కనుకనే భగవద్గీతలో "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"-అనునిట్టి వాక్యములెన్నియో ప్రసంగవశమున భగవానుడు ఆనతిచ్చియున్నారు. దేవుని పూజించునపుడుగాని, ధ్యానం చేయునపుడు గాని, జపం సల్పునపుడుగాని, తీర్థయాత్రాదులు గావించునపుడుగాని శ్రద్ధను జోడించినవాడే ఆయా పవిత్ర కార్యముల ఫలితమును పొందుచున్నాడు.

దేవాలయమునకు వెళ్ళినప్పుడు గుడిలో ఉన్న విగ్రహమును చూసి-"ఇది రాతి బొమ్మ" అని ఎవరును తలంచరు. "ఇది సాక్షాత్ భగవంతుని యొక్క స్వరూపము" అని మాత్రమే భావిస్తూంటారు. ఇట్టి శ్రద్ధ, విశ్వాసములు లేనివారికి ఫలితములు లభించనే లభించవు. అట్లే తీర్థస్థానములకు పోయినవారు ఆయా తీర్థములలో స్నానముచేసి "నేను పవిత్ర గంగోదకమందు, పావన సలిలములందు

స్నానంచేసి తత్పవిత్రతచే శుద్ధుడునగుచున్నాను" అని భావిస్తాడు. అట్టి శ్రద్ధచే, విశ్వాసంచే వారికి సత్ఫలితములే కలుగుతుంటాయి. అట్లే ఒక మంత్రమును జపించునపుడు 'నేనీ మంత్రప్రభావంచే పవిత్రుడనగుచున్నాన'నే భావన కలిగి యున్నవాడు అట్టి పవిత్రతనే పొందుతూంటాడు. కావున భావననుబట్టియే ఫలితము. శ్రద్ధావిశ్వాసములను బట్టియే ప్రయోజనము సిద్ధిస్తూంటుంది.

ఆధ్యాత్మిక కార్యక్రమములందు సాధకుడు ఎంతయో శ్రద్ధనూ, విశ్వాసాన్ని కలిగియుండాలి. పూర్వమెందరో మహనీయులు వారి వారి గురువుల యెడల, దైవము యెడల, శాస్త్రాదుల యెడల భక్తిప్రపత్తులు గలవారై ఆధ్యాత్మిక మార్గమున చక్కని పురోగతిని సాధించియున్నారు. సాధకునకు మొట్టమొదట్లోనే పరిపూర్ణాను భవములు కలుగవు కాబట్టి ముందుగా వారు తమ గురువులు చెప్పినదాని యెడల, శాస్త్రము చెప్పినదాని యెడల విశ్వాసం, శ్రద్ధ కలిగి ప్రయత్నం కొనసాగించాలి. అట్లు శ్రద్ధతో ఆచరించినప్పుడు కొంత కాలానికి గురువులు పొందిన అనుభూతిని శిష్యులు కూడా పొందగలరు.

"దేవుడుంటే నాకు కనిపించలేదే" అని ఎవరును అనగూడదు. ఆ దేవుని పొందుటకు పెద్దలు చెప్పిన మార్గాలను శ్రద్ధతో అనుసరించాలి. అపుడే దైవము ప్రత్యక్షముకాగా వారి సంశయమములన్నియు పటాపంచలైపోతాయి. కాబట్టి ఏ కార్యమందైనను శ్రద్ధ చాల అవసరం. శ్రద్ధతో కూడిన కార్యాలే జయప్రదములౌతాయి. అందుచేత పెద్దలు ఆధ్యాత్మిక సాధనలలో **శ్రద్ధకు** ప్రముఖ స్థానం ఏర్పాటు చేశారు. శివప్రసాద్! ఈ మహోన్నత సాధనను నీవు ఏ కాలమందును మరువవద్దు. శ్రద్ధతో సాధించు. విజయం పొందు.

**శిష్యుడు** — మహాత్మా! చక్కటి ప్రబోధం గావించారు. ఏది అవసరమో దానిని సెలవిచ్చారు. సాధకులు కొందరు తమ ప్రయత్నాలలో ఎందుకు అపజయం పొందుతున్నారో నాకిపుడు బాగా తెలిసింది. శ్రద్ధ యొక్క ఆవశ్యకత నాకిపుడు అంతుపట్టింది. ఇక ఏ కార్యమందైనను తమరు చెప్పిన ప్రకారం శ్రద్ధను జోడించి అక్కార్య సాఫల్యానికై తప్పక ప్రయత్నిస్తాను. సెలవు. OO

It is the self that predominates, and not matter.

ఆత్మయే సత్యము, దృశ్యప్రపంచము కాదు.

# ప్రకృతిలోని వింతలు-విశేషాలు

1) నీలి తిమింగలము చాల పెద్దది. అది 100 అడుగుల పొడవు, 1200 టన్నుల బరువు కలిగి యుండును.

2) జపాన్‌లోని టోకియో—ఒసాకాల మధ్య నడచు టొకైడో ఎక్స్‌ప్రెస్ కంప్యూటర్ల సహాయముతో నడచును. అదిగంటకు 200 కిలోమీటర్ల వేగముతో ప్రయాణించును.

3) శని గ్రహము చుట్టూ ఆవరించియున్న మేఘముల మందము 16 వేల మైళ్లు.

4) ప్రపంచములో మిక్కిలి ఎత్తైన ఆఫీసు కట్టడం అమెరికాలోని ఇల్లినాయిస్ చికాగోలో ఉన్న సియర్స్ టవర్. ఇది 110 అంతస్థులు కలిగి 1559 అడుగుల ఎత్తు కలిగియున్నది. దీని మొత్తము వైశాల్యము 44 లక్షల చదరపు అడుగులు.

5) వాలుచున్న పీసా టవరు ఎత్తు 1796 అడుగులు. ఇది లంబమునకు 16 అడుగుల 6 అంగుళములు వాలి యున్నది. దీని నిర్మాణము 1173వ సంవత్సరములో ప్రారంభమైనది. నిర్మాణము పూర్తియగుసరికి 200 సంవత్సరములుగడచినవి.

6) తొండ ఒక కంటితో ముందు ప్రక్క, మరొక కంటితో వెనుక ప్రక్క చూచును. అది తన శరీరము యొక్క రంగులు మార్చు కొనుచుండును.

7) శనిగ్రహము చాల తేలికయైన గ్రహము. అది నీటిపైన తేల గలదు. ఏలయనగా నీటి బరువుకంటే దాని బరువు తక్కువ.

○○



# వసిష్ఠవాణి

## యోగవాసిష్ఠసారము

శ్రీ విశ్వామిత్ర మునీంద్రుఁడు శ్రీరామచంద్రునితో నిట్లు చెప్పిరి- "ఓ రాఘవా! నీవు తెలిసికొనఁదగిన పదార్థములను దెలిసికొంటివి. కాని నీబుద్ధియను అద్దమున నింకను నొకింత శోధనము మాత్రము ఆవశ్యకమై యున్నది. వ్యాసమహర్షి యొక్క తనయుఁడగు శుకుఁడున్ను బూర్వమిట్లే జ్ఞేయము నెరింగియు నంతఃకరణ మున విశ్రాంతి మాత్రమునపేక్షించి యుండెను." అది విని శ్రీరాముఁడు "శుకుఁడు జ్ఞేయమెఱిగియు విశ్రాంతినెట్లు పొందకుండెను? తుదకెట్లు దానిని బొందగల్గెను?" జెప్పుడనిన, అంతట విశ్వామిత్రుఁడిట్లు శుకుని వృత్తాంతమును జెప్పదొడంగెను.

పూర్వము శ్రీ శుకదేవుఁడు దృశ్యపదార్థముల యెడల పూర్ణవిరక్తి నొంది తన వివేక విచారములచే పరమార్థ వస్తువును బొందినను, 'ఇదియే ఆ పరమాత్మ' (సత్య వస్తువు) అను విశ్వాసము లేనందున అశాంతచిత్తుఁడై, మేరుపర్వతముపై ఏకాంతమున నున్న తన తండ్రియగు వ్యాసభగవానుని "ఈ దృశ్య ప్రపంచమెట్లుత్పన్నమాయెను? ఇయ్యది ఎట్లు శమించును?"- అని యడిగెను. అందులకు వ్యాసముని చెప్పవలసిన దంతయుఁ జెప్పెను. దానిని విని శుకుఁడు తనలో "దీనిని నేను పూర్వమే యెఱింగి యుంటిని. ఇపుడు విశేషముగ నాతడేమియు చెప్పలేదు"-అని తలంచి, తండ్రి వాక్య ములను అధికముగ దలంపడాయెను. పుత్రుని భావము నెఱిగి వ్యాసులు సుతునితో తానంతకంటె నధికముగ నెఱుఁగననియు, వేద్యవస్తువు నెఱిగిన జనక మహారాజు యొద్దకుఁబోయినచో బొందవలసినదంతయు బొందుదువనియు జెప్ప, శుకుఁ డట్లే యచటికి బోవ ద్వారపాలకులాతని రాకను రాజునకెఱింగించిరి.

రాజాతనిని పరీక్షింపనెంచి ద్వారపాలునితో 'అట్లేయట నుండనిమ్ము' అని చెప్పి యేడుదినములట్లుండి పిమ్మట శుకుని భవన ప్రాంగణములోనికి రానిచ్చి మరల యచట యేడు దినములుండనిచ్చి, యాపై నాతని నంతఃపురములోనికి

# పరమార్థసూక్తులు



- ప్రకృతిని జయించుట కొఱకే మానవజన్మ ఏర్పడినది.
- మనస్సు నిర్మలమైనచో దుఃఖములన్నియు సమసిపోవును.
- నిందలు బయలుదేరిన చోటునకే వచ్చి చేరును.
- వివేకవంతుడు పర్వతమువంటివాడు. నిందాస్తుతులను పిల్లగాలులకతడు చలింపడు.
- ఒకరు నీకు చేయగూడదను దానిని నీవితరులకు చేయకు.
- కాలమును వృథా చేయకుడు.కాలగర్భములోనే జీవిత సుగంధముకలదు.
- ఇతరుల కొఱకు జీవించువారే నిజమైన మానవులు. ○○

---

రప్పించి, వారము దినములైన వెనుక రాజు మీతో కలియుదురని చెప్పించెను. అనేక సుందరస్త్రీలను వివిధ భోగ్యపదార్థములను, అతని యొద్దకు పంపెను, కాని శుకుఁడు భోగ, అనాదరముల రెండిటి యందును సమచిత్తము గల్గి పరిపూర్ణ మానసుఁడై వికారరహితుఁడై యుండెను. అట్టి యాతనినిగాంచి జనకుఁడు తాను వచ్చిన పని యేమని యాదరంబున బలుక శుకుఁడు తన తండ్రి నడిగిన ప్రశ్ననే తిరిగి యడిగెను. జనకుఁడును వ్యాసులు చెప్పిన ప్రత్యుత్తరమునే చెప్ప, నంత శుకుఁడు "తాము చెప్పినదాని నేనును నెఱుంగుదును; మా తండ్రియు నదియే వచించెను; శాస్త్రములును నట్లే చెప్పుచున్నయవి. అదియే సత్యమగుచో నాచిత్తముననే ప్రకారము సంశయరహితమగు నిశ్చలస్థితి గలుగునో సెలవీయుడ"ని ప్రార్థింప జనకుడిట్లు వచించెను– "నీవెఱింగినదానికంటె నధికముగఁ జెప్పవలసినదేదియు లేదు. అఖండమైన చిదాత్మ తప్ప వేఱేమియు నిటలేదు. జీవుఁడు తన సంకల్పముచేత బద్ధుఁడై నిస్సంకల్ప స్థితిచే ముక్తుఁడగుచున్నాఁడు. దృశ్య పదార్థముల యెడలఁ బూర్ణ విరక్తి నీకు కలిగినది కావున నీవు జ్ఞేయము నెఱింగినవాఁడవే యగుదువు. నీవెఱింగినదానికంటె జ్ఞేయవస్తువు అన్యము కాదు. కాఁబట్టి భ్రమను వీడుము"–జనకుని యా వాక్యముల విని శుకుఁడు సంశయరహితుఁడై మేరుపర్వత శిఖరముపైకి జని, అట పదివేలవత్సరములు నిర్వికల్ప సమాధియందుండి యా పిమ్మట విదేహ ముక్తుఁడాయెను. ○○

# విషయ వ్యామోహము

ఒక గ్రామములో ఒక వర్తకుడు అంగడి తెరచుకొని బేర గాండ్రకు వస్తువులను విక్రయించుచుండెను. ఒకనాడు మధ్యాహ్న సమయమున వర్తకుడేదియో పనిమీద బయటకు వెడలగా అంగడిలో ఎవరునులేని సమయము కనిపెట్టి ఒక కోతి లోనికి ప్రవేశించి ఒక ఇనుప కూజాలో చేయిదూర్చి లోనగల జీడిపప్పును గట్టిగా పట్టు కొని చేతిని పైకి లాగగా చేయి రాలేదు. ఏలయనగా కూజా మెడ సన్నగా నుండెను. గుప్పెట లావుగా నుండెను.

ఇంతలో వర్తకుడచటికి వచ్చి గదిలో కోతి యుండుట చూచి ఒక దుడ్డుకర్ర తీసికొని దానిని గట్టిగా బాదెను. అది పారిపోవ యత్నించెను గాని చేయి ఇనుపకూజాలో ఇరుకుకొనిపోవుటచే సాధ్యపడలేదు. ఆ దౌర్భాగ్యవానరము తన గుప్పిటలోని జీడిపప్పును వదలివేసినచో చేయి కూజానుండి సులభముగ బయటకు వచ్చి వేసియుండెడిది. కాని ఆశ అడ్డుపడినది. కోతి వీపుపై దెబ్బలు ఏక ధాటిగ పడుచుండెను. తత్ఫలితముగ కోతి తన ప్రాణములను వదలవలసివచ్చెను. ప్రాణములనైన వదలుటకు అది సిద్ధపడినదే కాని జీడిపప్పును మాత్రము వదలలేదు.

నేటి విషయదాసుల పరిస్థితి సరిగా ఇదే విధముగ నున్నది. ప్రాపంచిక భోగలాలసుడే ఆ కోతి. విషయభోగములే జీడిపప్పు. మృత్యువే వర్తకుడు. ఈ సంసారమే అంగడి. కావున మృత్యువుచే చావుదెబ్బలు తినక పూర్వమే జనులు శాస్త్ర, గురువాక్యములందు విశ్వాసము గలిగి తదుపదిష్ట ధర్మమార్గమును చక్కగ అనుష్ఠించి, విషయ వ్యామోహమును త్యజించివేయుట ఉత్తమము.

ОО

# శిఖర దర్శనం

## శ్రీ రామకోటేశ్వరమ్మ గారు (మంటాడ)

మన దేశంలో వున్నటువంటి పుణ్యక్షేత్రములలో శ్రీశైలము ఒక విశిష్ట స్థానము పొంది వున్నది. అక్కడకు వెళ్ళి శిఖర దర్శనం చేస్తే పునర్జన్మ లేదని అంటూ వుంటారు. శ్రీశైలంలో మల్లిఖార్జునస్వామివారి దేవాలయానికి అల్లంత దూరంలో ఒక కొండ వుంటుంది. ఆ కొండపైకి ఎక్కి చూస్తే అక్కడ ఒక పెద్ద రోలు, ఆ రోటిలో రుబ్బు పత్రంలాంటి ఒక చిన్న నంది వుంటుంది.

నవధాన్యములు కొన్నింటిని తీసుకొని కొంచెం నువ్వులు ఆ రోటిలో వేసి త్రిప్పుతూ శిఖర దర్శనం చేసుకొంటే ఆ పరమేశ్వరుడు జన్మ జన్మార్జిత మహాదోషములను తొలగించి తన సాయుజ్యమును ప్రసాదించును.

*శ్లో ॥ కేదారే హ్యుదకం పీత్వా । వారణాస్యాం మృతస్తథా ।*
*శ్రీశైలే శిఖరం దృష్ట్వా । పునర్జన్మ న విద్యతే ॥*

కేదారనాధ్‌లో ఉదకం పానం చేసినవారికి వారణాసిలో మరణించినవారికి శ్రీశైల శిఖర దర్శనం చేసిన వారికి పునర్జన్మలేదు–అని శృతి ప్రమాణం.

త్రేతాయుగంలో శ్రీరాముడు రావణాసురుణ్ణి సంహరించిన తరువాత బ్రహ్మ హత్యాపాతకము వెంటాడితే ఆయన ఈ శిఖర దర్శనం చేసుకొని ఆ దోషమును తొలగించుకొనెనట.

యుగపురుషుల వంటివారు కూడా తమ దోషములు నివారణ చేసుకోవటానికి ఈ పుణ్యక్షేత్రంలో శిఖరం దర్శించినారంటే ఇక సామాన్య జనులందరూ శ్రీశైలం వెళ్లి తీరవలసిందే.

దీనికి అంతరార్థం హృదయమనే రోలు. మనస్సు అనే పత్రం. అది పసువు లాంటిది. ఆ మనస్సు అనే (నంది) పత్రమును పసుపతి (అనగా పరమేశ్వరుని)కి అభిముఖంగా మళ్ళించుకోవాలి. నవవిధ ధాన్యములు అనగా నవవిధ భక్తి మార్గాలు వున్నాయి. తొమ్మిదింటిలో వక్క మార్గాన్నైనా ఈ నువ్వు గింజంత పరిమాణంగా అనుసంధించి ఆ పరమేశ్వరుని సేవకు పాత్రుడిని కావాలి.

శ్లో ॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనం ॥

1. భగవానుని యొక్క నామరూప గుణ ప్రభావలీల కథా ప్రసంగాదులు వినుట, 2. వాటిని కీర్తించుట, 3. భగవానుని స్మరించుట, 4. పాదసేవనం, 5. ఆరాధించుట, 6. భగవానునికి వందనము చేయుట, 7. భగవానునికి దాసుడుగాయుండుట, 8. భగవానునితో సఖ్యము సలుపుట, 9. పరమాత్మకు ఆత్మసమర్పణ చేయుట. ఈ విధముగా భక్తి నవ విధములై యున్నది.

హరిహరాదులను సేవించుకొనుటకు ఏ ఒక్క మార్గమును ఆశ్రయించిననూ చాలును.

ఉదా : 1. శ్రీ భగవద్గుణ శ్రవణముచే పరీక్షిత్తున్నూ, 2. భగవద్గుణ కీర్తనలచే శ్రీశుకులవారున్నూ, 3. నామస్మరణ మాత్రంచే ప్రహ్లాదుడున్నూ, 4. పాదసేవనముచే లక్ష్మీదేవియు, 5. భగవదారాధనచేత(పూజలు) పృధుచక్రవర్తియు, 6. వందనముచే అక్రూరుడు, 7. దాస్యముచే శ్రీమదాంజనేయుడును, 8. సఖ్యముచే అర్జునుడును, 9. సర్వమూ ఆత్మసమర్పణచేత బలిచక్రవర్తి, విభీషణుడున్నూ. ఒక్కొక్క భగవద్భక్తి గుణ విశేషముచే ఒక్కొక్కరూ భగవత్ప్రాప్తి పొంది వున్నారు.

నవద్వార నిర్మితమైన ఈ శరీరంలో నూలుగింజలోని నూనెవలె అంతర్లీనుడై పరమాత్మ వెలుగొందుచున్నాడు. సోహమనే మార్గము ననుసరించి త్రికూటస్థానమనే కొండ ఎక్కి సహస్రార శిఖర దర్శనం చేసుకోవాలి. అనగా పరమాత్మ సాక్షాత్కారమును పొందవలయును.

బాహ్యంగా శ్రీశైలం వెళ్ళి దర్శించినా ఆంతర్యంగా స్వామిని ఆరాధించటం అనేది చాలా గొప్ప అనుభవం. అది సద్గురువు వలననే సాధ్యం.

OO

**అంగిరస ఉవాచ**

**హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః**
**అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవహి పావకః**

**దుష్టులు స్మరించినప్పటికిని శ్రీహరి వారి పాపములను పోగొట్టు! తెలియక తాకినను అగ్ని కాల్చివేయునుగదా!**

# మొసలిపై సవారి

ఒక ఊళ్ళో ఒకాయన తీర్థయాత్రకై బయలుదేరాడు. పాదచారియై యాత్ర సమాప్తం చేయాలని అతడు నిర్ణయించుకున్నాడు. ఇల్లు వదలి ప్రయాణం ప్రారంభించాడు. ఎన్నో గ్రామాలు, పట్టణాలు దాటిపోయాడు. ఇంతలో సాయంత్ర మైంది, చీకటి పడింది. దగ్గరగా వున్న గ్రామానికి త్వరగా చేరుకోవాలనుకొన్నాడు. కానీ దారిలో ఒక పెద్ద నది అడ్డంగా వచ్చింది. దాంట్లో నీళ్ళు బ్రహ్మాండంగా ప్రవహిస్తున్నాయి. అతడు ఏ విధంగానైనా త్వరగా అవతలి ఒడ్డు చేరదలిచాడు.

నది ఒడ్డున ఏదైన పడవ వున్నదేమోనని తీరాన చాలాదూరం నడచి వెళ్ళాడు. కానీ ఎక్కడా పడవ జాడ కనపడలేదు. ఇంతలో దూరాన నది ఒడ్డున ఒక నల్లటికొయ్య మొద్దు పడి వుండటం ఆ యాత్రీకుడు గమనించాడు. త్వరత్వరగా దానివైపు నడవసాగాడు. ఆ కొయ్యమొద్దు సమీపానికి చేరి పరమానందపడి "ఆహా! అవతలి ఒడ్డుకు పోవటానికి ఒక చక్కటి వాహనం దొరికింది కదా!" అని సంతృప్తి చెందాడు.

తదుపరి అతడు ఆ కొయ్యమొద్దును నీటిలోనికి నెట్టి దానిపై కూర్చొని చేతులతో మెల్లగా నీటిని కదిలిస్తూ నదిపై గమనం సాగించాడు. ఈ ప్రకారంగా కొంత సేపటికి నదీమధ్యభాగానికి చేరుకున్నాడు. ఆ సమయాన ఆకాశం మేఘావృతమై వుంది. తళుక్కున ఒక మెరపు మెరిసింది. ఆ మెరుపు కాంతిలో చూడగా తాను ఎక్కి నది నల్లటి కొయ్యమొద్దు కాదని ఒక మొసలి అని ఆ యాత్రికుడు గ్రహించగలిగాడు. అపుడు అతడు భీతిల్లి తన నదీప్రయాణం సురక్షితంగా జరుగదని, మహా ప్రమాదాన్ని ఎదుర్కోవలసి వస్తుందని నిర్ణయించుకున్నాడు. అవతలి ఒడ్డు చేరలేనని గట్టిగా నిశ్చయించుకొన్నాడు.

అట్లే దేహాభిమానం కలిగి ఈ శరీరమే తానని భావిస్తూ ఎవరైనా మోక్షం పొం దాలనుకుంటే పై దృష్టాంతంలోవలె యాత్రికుడు ఆవలిఒడ్డు చేరుట అసాధ్యమైనట్లు

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వన్దనం దాస్యం సఖ్యం మాత్మ నివేదనం ॥

1. భగవానుని యొక్క నామరూప గుణ ప్రభావలీల కథా ప్రసంగాదులు వినుట, 2. వాటిని కీర్తించుట, 3. భగవానుని స్మరించుట, 4. పాదసేవనం, 5. ఆరాధించుట, 6. భగవానునికి వందనము చేయుట, 7. భగవానునికి దాసుడుగాయుండుట, 8. భగవానునితో సఖ్యము సలుపుట, 9. పరమాత్మకు ఆత్మసమర్పణ చేయుట. ఈ విధముగా భక్తి నవ విధములై యున్నది.

హరిహరాదులను సేవించుకొనుటకు ఏ ఒక్క మార్గమును ఆశ్రయించిననూ చాలును.

ఉదా : 1. శ్రీ భగవద్గుణ శ్రవణముచే పరీక్షిత్తున్నూ, 2. భగవద్గుణ కీర్తనంచే శ్రీశుకులవారున్నూ, 3. నామస్మరణ మాత్రంచే ప్రహ్లాదుడున్నూ, 4. పాదసేవనముచే లక్ష్మీదేవియు, 5. భగవదారాధనచేత(పూజలు) పృధుచక్రవర్తియు, 6. వందనముచే అక్రూరుడు, 7. దాస్యముచే శ్రీమదాంజనేయుడును, 8. సఖ్యముచే అర్జునుడును, 9. సర్వమూ ఆత్మసమర్పణచేత బలిచక్రవర్తి, విభీషణుడున్నూ. ఒక్కొక్క భగవద్భక్తి గుణ విశేషముచే ఒక్కొక్కరూ భగవత్ప్రాప్తి పొంది వున్నారు.

నవద్వార నిర్మితమైన ఈ శరీరంలో నూలుగింజలోని నూనెవలె అంతర్లీనుడై పరమాత్మ వెలుగొందుచున్నాడు. సోహమనే మార్గము ననుసరించి త్రికూట స్థానమనే కొండ ఎక్కి సహస్రార శిఖర దర్శనం చేసుకోవాలి. అనగా పరమాత్మ సాక్షాత్కారమును పొందవలయును.

బాహ్యంగా శ్రీశైలం వెళ్లి దర్శించినా ఆంతర్యంగా స్వామిని ఆరాదించటం అనేది చాలా గొప్ప అనుభవం. అది సద్గురువు వలననే సాధ్యం.

## అంగిరస ఉవాచ

**హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః**
**అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవహి పావకః**

**దుష్టులు స్మరించినప్పటికిని శ్రీహరి వారి పాప...**
**తెలియక తాకినను అగ్ని కాల్చివేయునుగదా!**

# మొసలిపై సవారి

ఒక ఊళ్ళో ఒకాయన తీర్థయాత్రకై బయలుదేరాడు. పాదచారియై తీర్థ యాత్ర సమాప్తం చేయాలని అతడు నిర్ణయించుకున్నాడు. ఇల్లు వదలి ప్రయాణం ప్రారంభించాడు. ఎన్నో గ్రామాలు, పట్టణాలు దాటిపోయాడు. ఇంతలో సాయంత్ర మైంది, చీకటి పడింది. దగ్గరగా వున్న గ్రామానికి త్వరగా చేరుకోవాలనుకొన్నాడు. కానీ దారిలో ఒక పెద్ద నది అడ్డంగా వచ్చింది. దాంట్లో నీళ్ళు బ్రహ్మాండంగా ప్రవ హిస్తున్నాయి. అతడు ఏ విధంగానైనా త్వరగా అవతలి ఒడ్డు చేరదలిచాడు.

నది ఒడ్డున ఏదైన పడవ వున్నదేమోనని తీరాన చాలాదూరం నడచి వెళ్ళాడు. కానీ ఎక్కడా పడవ జాడ కనపడలేదు. ఇంతలో దూరాన నది ఒడ్డున ఒక నల్లటికొయ్య మొద్దు పడి వుండటం ఆ యాత్రీకుడు గమనించాడు. త్వరత్వరగా దానివైపు నడవసాగాడు. ఆ కొయ్యమొద్దు సమీపానికి చేరి పరమానందపడి "ఆహా! అవతలి ఒడ్డుకు పోవటానికి ఒక చక్కటి వాహనం దొరికింది కదా!" అని సంతృప్తి చెందాడు.

తదుపరి అతడు ఆ కొయ్యమొద్దును నీటిలోనికి నెట్టి దానిపై కూర్చొని చేతులతో మెల్లగా నీటిని కదిలిస్తూ నదిపై గమనం సాగించాడు. ఈ ప్రకారంగా కొంత సేపటికి నదీమధ్యభాగానికి చేరుకున్నాడు. ఆ సమయాన ఆకాశం మేఘావృతమై వుంది. తళుక్కున ఒక మెరపు మెరిసింది. ఆ మెరుపు కాంతిలో చూడగా తాను ఎక్కి నది నల్లటి కొయ్యమొద్దు కాదని ఒక మొసలి అని ఆ యాత్రికుడు గ్రహించగలిగాడు. అపుడు అతడు భీతిల్లి తన నదీప్రయాణం సురక్షితంగా జరుగదని, మహా ప్రమాదాన్ని ఎదుర్కోవలసి వస్తుందని నిర్ణయించుకున్నాడు. అవతలి ఒడ్డు చేరలేనని గట్టిగా నిశ్చయించుకొన్నాడు.

అట్లే దేహాభిమానం కలిగి ఈ శరీరమే తానని భావిస్తూ ఎవరైనా మోక్షం పొం దాలనుకుంటే పై దృష్టాంతంలోవలె యాత్రికుడు ఆవలిఒడ్డు చేరుట అసాధ్యమైనట్లు

# ఆత్మజ్ఞాన సంధానము

ముముక్షువులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

పశ్యద్రూపే శరీరేఽస్మిన్న్యాతస్థాత్మా చిదాస్పదః
భూతవృన్దమహం సామ్యాత్తేన జీవామ్యనామయః

చేతన ప్రాయముగ కానిపించు ఈ జడశరీరమున ఉన్నప్పటికిని నేను శరీరాత్మదర్శిని కాను. చిన్మాత్రాత్మదర్శినే అయియున్నాను. మరియు చిదాత్మ సర్వ ప్రాణులందును సమముగ నుండుటంబట్టి నేను సర్వభూతములందలి ఆత్మయే అయి, ఆ భూత సమూహమును నా శరీరమువలె గాంచుచున్నాను. దానిచే నేను సంతాపరహితుడనై జీవించుచున్నాను. ○○

ఆత్మానుభూతి నొందుట కూడ అసాధ్యమే కాగలదు. కాబట్టి ఆత్మసాక్షాత్కారము పొందాలని, ఈ జన్మలోనే మోక్షం సాధించాలని అనుకున్నవారు దేహాభిమానాన్ని త్యజించాలి, దేహోహంభావాన్ని వీడాలి. తాను జడమైన దేహం కాదని, పంచభూతాత్మక స్వరూపం తాను కాదని పదే పదే మననం చేస్తూండాలి.

ప్రపంచభావన, దేహభావన, మనోభావన ఈ మూడిటిని వదిలేవాడే ఆత్మ స్థితికి చేరుకోగలుగుతాడు. కాబట్టి విజ్ఞుడగువాడు తన నిజస్వరూపమగు ఆత్మను గూర్చి నిరంతరం చింతన చేస్తూ "దేహోఽహం" అను భావాన్ని వదలి "శివోఽహం" అని ఎలుగెత్తి పాడుచు శివస్వరూపుడై, పవిత్రాత్ముడై బ్రహ్మానందాన్ని ఈ జీవితం లోనే అనుభవించాలి. త్వరగా సాధనలను ప్రారంభించాలి. పట్టుదల వహించాలి. గమ్యాన్ని త్వరగా చేరుకోవాలనే దీక్ష వహించాలి. త్రోవలో వచ్చు ఆటంకాలను లెక్క చేయరాదు. ధీరబుద్ధితో ముందుకు సాగాలి. జై గురుదేవ్.

శరీర పోషణార్థీసన్ య ఆత్మానం దిదృక్షతి
గ్రాహం దారుధియా ధృత్వానదీంతర్తుం సగచ్ఛతి. (వివేకచూడామణి)

○○

# వీరిని గురించి తెలుసుకోండి

## కార్తవీర్యార్జునుడు

కార్తవీర్యార్జునుడు కృతవీర్యుని యొక్క పుత్రుడు. అతడు హైహయవంశమునకు చెందిన రాజు. వింధ్యపర్వతముల సమీపమునగల మాహిష్మతీపురమును రాజధానిగా చేసుకొని అతడు రాజ్యమును పాలించుచుండెను. రాజపురోహితుడగు గర్గుని ఉపదేశానుసారము సాక్షాత్ నారాయణావతారమగు దత్తాత్రేయుల వారిని అతడు ఆరాధించసాగెను. దత్తాత్రేయులవారి వరప్రభావముచే అతడు సహస్రబాహువులను పొందెను.

ఒక సమయమున అగ్ని కార్తవీర్యార్జునుని సమీపించి తనకు ఆహారమును ప్రసాదించమని కోరెను. అందులకాతడు గిరినగరారణ్యమును భక్షింపుమని అగ్నికి తెలిపెను. అటులనే అగ్ని ఆ అరణ్యమును దహించుచుండగా అందుగల మైత్రావరుణుని ఆశ్రమము కూడా దగ్ధమైపోయెను. అంతట మైత్రావరుణుని పుత్రుడు 'కార్తవీర్యుని యొక్క బాహువులను పరశురాముడు ఖండించుగాక' అని శపించెను.

ఆ విషయము తెలుసుకొని కార్తవీర్యార్జునుడు మిక్కిలి పరితాపమును పొందెను. అప్పటి నుండి అతడు లౌకిక వ్యవహారములందు ఆసక్తిని విడనాడి ధర్మకార్యములు, పుణ్యకార్యములు ఆచరించుటయందు తత్పరుడై యుండెను.

ఒకసారి లంకాధిపతియగు రావణాసురుడు కార్తవీర్యార్జునునితో యుద్ధము చేయ తలపెట్టెను. నర్మదాతీరమందు విహారము సలుపుచున్న అతనిని చూచి రావణుడు పరిహసించెను. అపుడు అతడు రావణుని ఓడించి బంధించియుంచెను. పిదప పులస్త్యు ప్రార్థన మేరకు అతడు రావణుని బంధవిముక్తునిగ ఒనర్చెను.

మరొకపుడు కార్తవీర్యార్జునుడు వేటకై అరణ్యమందు తిరుగాడుచు జమదగ్ని ఆశ్రమమును చేరెను. అచటగల ధేనువు సహాయమున జమదగ్ని ఆ రాజునకు సమస్త సౌకర్యములను, గొప్ప విందును ఏర్పాటుచేసెను. ఆ ధేనువును తనకిమ్మని రాజు అతనిని కోరగా, అతడు నిరాకరించెను. పిదప రాజు తన రాజ్యమును చేరి,

(తరువాయి 40వ పేజీలో)

## విజయ కీలకము

ఏ కార్యములందైనను విజయలక్ష్మిని చేబట్టవలెనన్న పట్టుదల, ధైర్యము అవసరములు. తీవ్రతర ప్రయత్నము అవసరము. కాబట్టి కార్యమునందు విజయమును సాధించ గోరువాడు ప్రబలతర ప్రయత్నమును గావించుచు ధైర్యము తోను, ఉత్సాహముతోను, పట్టుదలతోను అక్కార్యమును నెరవేర్చవలెను. దుర్బలత్వమునకు, బద్ధకమునకు, సోమరి తనమునకు అవకాశమే ఈయరాదు. ఈ ప్రకారము యత్న శీలురైయుండువారు కార్యమందు తప్పక విజయమును బడసియే తీరుదురు. పూర్వజన్మలందలి చెడ్డ సంస్కా రములను ఈ జన్మలోని పురుష ప్రయత్నముచే అవలీలగా జయించివేసి సాధకుడు అధ్యాత్మరంగమున విజయమును కైవసమొనర్చుకొనవలెను. నిరుత్సాహమునకు ఏమాత్రము తావీయరాదు.

శ్లో॥ పరం పౌరుష మాశ్రిత్య దన్తైర్దన్తాన్విచూర్ణయన్
శుభేనాశుభ ముద్యుక్తం ప్రాక్తనం పౌరుషం జయేత్

తా॥ గొప్ప పురుష ప్రయత్నము నాచరించి పళ్లను పళ్లతో కొరికి (పట్టుదల వహించి) పూర్వజన్మల అశుభ సంస్కారములను ఈ జన్మయందలి శుభ సంస్కారములచే జయించివేయవలెను.

# వేదాంతభేరి శాశ్వత చందాదారులు
## (Life Members)

**వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :-**

**శాశ్వత చందా రు. 300/-లు**

1. శ్రీ వై. అప్పలాచారి గారు – భీమునిపట్నం
2. శ్రీ కె. శ్రీనివాసరావు గారు – పెద్దకొట్టాల
3. శ్రీ పి. నరసింహారావు గారు – బి. దొడ్డవరం
4. శ్రీ ఎన్. లక్ష్మీనారాయణ గారు – హైదరాబాద్
5. శ్రీ పి. రాజమల్లయ్య గారు – నిజామాబాద్
6. శ్రీ డి. సీతారామయ్య గారు – హైదరాబాద్
7. శ్రీ ఎస్. రామకోటేశ్వరరావు గారు – రాజమండ్రి
8. శ్రీ ఎన్. శ్రీనివాసులుశెట్టి గారు – రాజంపేట
9. శ్రీ ఎన్.ఎల్.వి. రమణశర్మ గారు – పెదనందిపాడు
10. శ్రీ ఎమ్. విజయకృష్ణ గారు – తుని
11. శ్రీ వి.వి. సుబ్రహ్మణ్యం గారు – హైదరాబాద్
12. శ్రీ వి. చంద్రయ్య గారు – మంచిర్యాల
13. శ్రీ పి. రాజమల్లారెడ్డి గారు – హైదరాబాద్
14. శ్రీ ఎస్. శ్రీమన్నారాయణ గారు – విజయవాడ
15. శ్రీ డా. ఎస్.జె. రెడ్డి గారు – సికింద్రాబాద్
16. శ్రీ కె. శేఖరయ్య గారు – ఖానాపూర్
17. శ్రీ డి. నరసయ్య కె. గారు – నిజామాబాద్
18. డా. బి.ఎల్. మూర్తి గారు – చౌకీపేట
19. శ్రీ ఎస్. వీరాస్వామి గారు – ప్రొద్దుటూరు
20. శ్రీ ఎ. దేవేంద్రప్రసాద్ గారు – విజయవాడ
21. శ్రీ ఎ. నరసింహారావు గారు – సికింద్రాబాద్
22. శ్రీ వి. ఉమ గారు – విశాఖ
23. శ్రీ ఎస్. వేంకటేశ్వరరావు గారు – విజయవాడ






1. ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న 'శ్రీ భక్త కన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి' భవన నిర్మాణము పూర్తి అయినది.
2. త్వరలో ప్రారంభోత్సవమునకు తుదిమెరుగులు దిద్దుకొనుచున్నది.
3. శ్రీ శుకబ్రహ్మాశ్రమము ఫోను నెంబర్లు మారియున్నవి.

   కొత్త ఫోను నెంబర్లు : 2239, 2543 STD Code 08578
4. శ్రీ స్వాములవారు తమ పర్యటనలు పూర్తిచేసుకొని ఆశ్రమమునందే యున్నారు.
5. ఆశ్రమములో బీద విద్యార్థులకు విద్య, భోజన వసతులు ఉచితముగా ఏర్పాటు చేయబడును. 5, 6, 7వ తరగతులు చదువుకొనదలంచినవారు అప్లికేషన్స్ మే నెల చివరిలోగా ఆశ్రమమునకు పంపుకొనవలెను.

## ప్రత్యేక వార్త

1. శ్రీ డి. శ్రీనివాసులు గారు B.E., (హైదరాబాద్) రూ.50,000
   (ఆస్పత్రికి కంప్యూటర్ పరికరము కొరకు)
2. శ్రీ దన్నపనేని శ్రీమన్నారాయణరావు గారి రూ.25,000
   ధర్మపత్ని శ్రీమతి బేబి గారు, ఈదర (స్త్రీల వార్డులో గది కొరకు)
3. శ్రీ డి.నరసింగరావు గారు, హుస్సేనీ ఆలం, హైదరాబాద్ రూ.30,000
   (ఆస్పత్రి భవనమునకు మొత్తం రంగులు వేయించుచున్నారు)

# భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి

## శాశ్వత సభ్యులు (Life Members)

శ్రీ కాళహస్తియందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు నూతనముగ నిర్మింప బడిన "భక్తకన్నప్ప ఉచితకంటి ఆస్పత్రికి" శాశ్వత సభ్యులుగ చేరిన భక్తుల పేర్లు ఈ క్రింద తెలుపబడినవి.

## శాశ్వత సభ్యత్వ విరాళము రూ.11,116/–లు.

ఈ పైకము బ్యాంకునందు ఫిక్స్డ్ డిపాజిట్‌గ వేసి దానిపై వచ్చు వడ్డీతో సంవత్సరమునకు ఒక రోజు దాత పేరుతోగాని, వారి తల్లిదండ్రుల పేరుతోగాని ఆస్పత్రిలో రోగులకు వైద్యసేవ గావింపబడును. రోగులకు భోజనాది వసతులు కూడా ఏర్పాటు చేయబడును.

గత సంచికయందు కొందరు దాతల పేర్లు ప్రకటింపబడినవి. ఈ సంచికయందు మరికొందరు దాతల పేర్లు ప్రకటింపబడుచున్నవి–

1. శ్రీ గెలివి వేంకటసుబ్బయ్య గారు – నంద్యాల
2. శ్రీ శేగు వేంకట ఆనందమోహన్ గారు – నంద్యాల
3. శ్రీ నెరవాటి కృష్ణమూర్తి గారు – నంద్యాల
4. శ్రీ లగిశెట్టి బాలిశెట్టి గారు – నంద్యాల
5. శ్రీ పాణ్యం రామయ్య గారు – నంద్యాల
6. శ్రీ బి. శంకరప్ప గారు – నంద్యాల
7. శ్రీ లగిశెట్టి నాగిశెట్టి గారు – నంద్యాల
8. శ్రీ వి. రాజారాం దివాకర్ గారు – నంద్యాల
9. శ్రీ ఎస్. బాలకుసుమ గారు – హైదరాబాద్
10. శ్రీ ఎర్రా సుబ్బారాయుడు గారు – హైదరాబాద్
11. శ్రీమతి సిహెచ్. అపర్ణ గారు – హైదరాబాద్
12. శ్రీ దత్తాత్రి చెన్నావార్ గారు –హైదరాబాద్
13. శ్రీ ఎస్. మాణిక్యరావు గారు – హైదరాబాద్
14. శ్రీ కె. సుదర్శన్ గారు – హైదరాబాద్
15. శ్రీమతి కె. విజయ గారు – హైదరాబాద్
16. శ్రీ ఎమ్. అన్నపూర్ణాదేవి పద్మనాభం గారు – హైదరాబాద్
17. శ్రీ రామతరం రామనాథ్ ఎమ్. గారు – హైదరాబాద్

18. శ్రీ వి. రాజ్యలక్ష్మి గారు –హైదరాబాద్
19. శ్రీ పి. భాస్కరరావు నాయుడు గారు – హైదరాబాద్
20. శ్రీమతి ఎస్. శోభారాణి గారు – హైదరాబాద్
21. శ్రీ జి. సరళాదేవి గారు – హైదరాబాద్
22. శ్రీ వై. తిరుపతిరావు గారు – కోరుట్ల
23. శ్రీ జి. రామారాయుడు గారు – గుంటూరు
24. శ్రీ పెండ్యాల రంగారావు గారు – ఒంగోలు
25. శ్రీ ఆర్. సుబ్బరాజు గారు – విశాఖ
26. శ్రీ జె.వి. కృష్ణారావు గారు – విజయవాడ
27. శ్రీ దారా వేంకటరత్నం గారు – మచిలీపట్నం
28. శ్రీ డా॥ వి. దుర్గేశ్ నందిని గారు – హైదరాబాద్
29. శ్రీ ఆంజనేయులు గారు – విజయవాడ
30. శ్రీ పాండు గారు – హైదరాబాద్
31. శ్రీమతి బి. కౌసల్య గారు – సికింద్రాబాద్
32. శ్రీ ఎస్. మల్లయ్య గారు – హైదరాబాద్
33. శ్రీ బొప్పిడి శంకర్‌రెడ్డి గారు – హైదరాబాద్
34. శ్రీ డా॥ కె. జానకీరామయ్య గారు – ఫోర్ట్‌వెయిన్ U.S.A.
35. శ్రీ అల్లాడి నరసింహారావు గారు – సికింద్రాబాద్ OO

(35వ పేజీ తరువాయి)

ఆ ధేనువును తీసుకొని రమ్మని తన సేనను పంపెను. ఆ సేన వెళ్లి ఆ మునిని సంహరించెను. కాని ఆ ధేనువు వారికి దక్కలేదు. తన తండ్రి మరణవార్త నెఱిగి పరశురాముడు కోపోద్రిక్తుడై కార్తవీర్యార్జునునితో యుద్ధము చేసి అతనిని వధించెను.

(అహంకారము, దంభము, దర్పము, గర్వము మున్నగు దుర్గుణములు జీవునకు పతనహేతువులై యున్నవి. అవి నరకద్వారములే యగును. కాబట్టి అభ్యున్నతిని కాంక్షించు మానవుడు ఆ అసురగుణములను ఏ కాలమందును దరికి చేర్చరాదు)

కార్తవీర్యార్జునుని వృత్తాంతము భాగవతము, భారతము, ఉత్తర రామాయణము, మార్కండేయపురాణములందు కలదు. OO

Printed and Published by Vemuri Balaram for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
Editor : B. ESWAR

# నారద భక్తి సూత్రములు–76

## భక్తి శాస్త్రాణి మననీయాని తదుద్బోధక కర్మాణి కరణీయాని.

*తా॥* భక్తిని గూర్చి ప్రబోధించు శాస్త్రములను చదువవలెను. చదివినదానిని లెస్సగ మననము, నిదిధ్యాసము గావింప వలెను. మఱియు ఆయా భక్తి ప్రబోధక శాస్త్రములందు తెలుపబడిన కర్మలను ఆచరించవలెను.

వ్యాఖ్య :– భక్తుడగువాడు భక్తిని గూర్చి లెస్సగ బోధించు భాగవ తాది గ్రంథములను బాగుగ చదువుచు అందలి భావము లను మననము చేయుచు, వాటిని ఆచరణయందుం చుచు నుండవలెను. మఱియు ఆ శాస్త్రములు భక్తి యొక్క అభివృద్ధికై తెలుపు కర్మలను అతడు చేయ వలెను. జపము, ధ్యానము, సంకీర్తనము, పారాయణము, సత్సాంగత్యము, ఏకాంతవాసము, తీర్థాటనము– మున్నగు క్రియలను భక్తుడు తప్పక ఆచరించవలెను.

భక్తి యొక్క అభివృద్ధికి స్వాధ్యయనము, సచ్ఛాస్త్ర పఠనము, సత్కర్మాచరణము మిక్కుటముగ తోడ్పడ గలవు. భక్తుడగువాడు భగవద్ధ్యానాదులందు ఎంతవఱకు చిత్తమును నెలకొల్పగలడో అంతవఱకు వాటిని ఆచరించి, శేషించు సమయమును శాస్త్ర పఠనాదులందు వినియోగించవలయును. కాలమును వ్యర్థము చేయ రాదు. దైవభావమందే భక్తుడు సదా నిమగ్నుడైయుండ వలయును.

ఓం